# వంగారి నాటిన చెట్లు – ఆశల విత్తనాలు

## ఆఫ్రికా యదార్థ గాథ

జేనెట్ వింటర్, తెలుగు: కె. సురేష్





**“The earth was naked.**
**For me the mission was to try**
**to cover it with green.”**
- WANGARI MAATHAI

**“పుడమి నగ్నంగా ఉంది.**

**దానిని పచ్చదనంతో కప్పటం**

**నా ధ్యేయంగా చేసుకున్నాను.”**

– వంగారి మాథాయ్



Wangari lives under the umbrella of green trees in the shadow of Mount Kenya in Africa.

ఆఫ్రికాలోని కెన్యా పర్వతం కింద పచ్చని చెట్ల నీడలో వంగారి పెరిగింది.



She watches the birds in the forest where she and her mother go to gather firewood for cooking.

కట్టెపుల్లల కోసం అమ్మతోపాటు అడవికి వెళ్లినప్పుడు ఆమె పిట్టలను చూస్తూ ఉండేది.




And she helps harvest the sweet potatoes, sugarcane, and maize from the rich soil.

సారవంతమైన ఆ నేలలో పండే చిలకడదుంప, చెరకు, మొక్కజొన్న వంటి పంటల కోతలలో ఆమె సహాయపడేది.



Wangari shines in school, and when she grows tall, like the trees in the forest, she wins a scholarship to study in America.

వంగారి బాగా చదివేది. అడవిలో చెట్లమాదిరి పొడవుగా అయినప్పుడు అమెరికాలో చదువుకోటానికి ఆమెకు స్కాలర్‌షిప్ లభించింది.



Six years later, her studies over, Wangari returns to Kenya home and sees a change. *What has happened?* She wonders. *Where are the trees?*

చదువులు పూర్తి చేసుకుని ఆరు సంవత్సరాల తరువాత కెన్యా తిరిగివచ్చిన వంగారీకి అక్కడంతా మారిపోయి కనిపించింది. *ఏం జరిగింది?* ఆమె ఆశ్చర్యపోయింది. *చెట్లన్నీ ఏమైపోయాయి?*



Wangari sees women bent from hauling firewood miles and miles from home.  She sees barren land where no crops grow. *And where are the birds?*

ఎన్నో మైళ్లనుంచి నడుములు వంగిపోయేలా కట్టెపుల్లలు మోసుకొస్తున్న ఆడవాళ్లను వంగారీ చూసింది. పంటలు పండకుండా కెన్యా భూములు బీడుబారాయి. పిట్టలన్నీ ఏమైపోయాయి?



Thousand of trees have been cut down to make room for buildings, but no one planted new trees to take their place. *Will all of Kenya become a desert?* She wonders as her tears fall.

నిర్మాణాల కోసం వేలాది చెట్లు కొట్టేస్తున్నారు. కానీ వాటికి బదులు కొత్త చెట్లు నాటటం లేదు. *కెన్యా అంతా ఎడారిగా మారిపోదు కదా?* ఆమె కన్నీటి పర్యంతమయ్యింది.



Wangari thinks about the barren land. *I can begin to replace some of the lost trees here in my own backyard – one tree at a time.* She starts by planting nine seedlings.

వంగారి బీడు భూముల గురించి ఆలోచించసాగింది. *ఒక్కొక్క మొక్క చొప్పున - పోయిన చెట్లను ముందుగా నా పెరడులో నాటతాను.* అలా ఆమె తొమ్మిది మొక్కలతో మొదలుపెట్టింది.



Watching the seedlings take root gives Wangari the idea to plant more – to start a farm for baby trees, a nursery. In an open space, she plants row after row of the tiny trees.

ఆ మొక్కలు వేళ్లూనుకోవటంతో మరిన్ని మొక్కలు నాటాలని వంగారి అనుకుంది. ముందుగా నర్సరీతో మొదలుపెట్టింది. తరువాత ఖాళీ ప్రదేశంలో వరసల్లో మొక్కలు నాటసాగింది.



Next Wangari convinces the village women that planting trees is a good thing. She gives each one a seedling. “Our lives will be better when we have trees again. You’ll see. We are planting the seeds of hope.”

తరువాత చెట్లు నాటటం మంచిదని ఊళ్లోని ఇతర మహిళలను ఒప్పించింది వంగారి. ఒక్కొక్కరికి ఒక్కొక్క మొక్క ఇచ్చింది. “చెట్లు తిరిగివస్తే మన జీవితాలు బాగవుతాయి. మీరే చూస్తారు కదా. మనం ఆశల విత్తనాలను నాటుతున్నాం.”




The women spread out over their village, planting tiny trees in long rows.

వరసల్లో మొక్కలు నాటుతూ మహిళలు ఊరంతా విస్తరించారు.



Like a green belt stretching over the land.

భూమి మీద అది ఒక పచ్చని పట్టీ లాగా ఉంది.



The government men laugh. “Women can’t do this,” they say. “It takes trained foresters to plant trees.” The women ignore the laughter and keep planting.

ప్రభుత్వాధికారులు వాళ్లను చూసి నవ్వారు. “ఈ పని ఆడవాళ్లు చెయ్యలేరు,” అన్నారు. “శిక్షితులైన అటవీ అధికారులే మొక్కలు నాటగలుగుతారు.” ఈ నవ్వులను పట్టించుకోకుండా మహిళలు మొక్కలు నాటుతూపోయారు.



Wangari pays them a small amount for each seedling still living after three months – their first earnings ever.

మూడు నెలల తరువాత బతికి ఉన్న ప్రతి మొక్కకి మహిళలకు వంగారి కొంత డబ్బు ఇచ్చేది – వాళ్ల తొలి ఆదాయం అదే.



Word travels, like wind rustling through leaves, about the green returning to Wangari's village.

చెట్లలో గాలి గలగలమంటూ ప్రసరించినట్లు వంగారి గ్రామం పచ్చబారుతోందన్న వార్త అంతటా వ్యాపించింది.



Soon other women in other villages and towns and cities in Kenya are planting long rows of seedlings, too.

కొంతకాలానికి కెన్యాలోని ఇతర గ్రామాలు, పట్టణాలు, నగరాలలోని మహిళలు కూడా వరసల్లో ఎన్నో మొక్కలు నాటసాగారు.



But the cutting continues.

అయితే, ఇంకోవైపు చెట్లను నరకటం ఆగలేదు.



Wangari stands tall as an oak to protect the old trees still remaining. “We need a park more than we need an office tower.”

మిగిలి ఉన్న పెద్ద చెట్లను కాపాడటానికి వంగారి పూనుకుంది. “ఎత్తైన కార్యాలయ భవనాల కంటే ఎక్కువగా మనకు ఉద్యానవనాలు కావాలి.”



The government men disagree. Wangari blocks their way, so they hit her with clubs. They call her a troublemaker and put her in jail.

ప్రభుత్వాధికారులకు అది నచ్చలేదు. వంగారి తమ దారికి అడ్డుగా ఉందంటూ ఆమెను లాఠీలతో కొట్టారు. సమస్యలు సృష్టిస్తోందంటూ ఆమెను జైలులో పెట్టారు.



And still she stands tall. *Right is right, even if you are alone.*

అయినా వంగారి తలబగ్గలేదు. *నువ్వు ఒంటరిగా ఉన్నా నిజం నిజం కాకుండా పోదు.*



But Wangari is not alone. Talk of the trees spread all over Africa like ripples in Lake Victoria.

కానీ వంగారి ఒంటరిగా లేదు. విక్టోరియా సరస్సులో అలలు వ్యాపించినట్టు చెట్ల గురించి మాటలు ఆఫ్రికా అంతటా విస్తరించాయి



More women hear the talk and plant even more seedlings in longer and longer rows. The seedlings take root and grow tall – until there are over 30 million trees where there was none.

ఈ వార్త మరింతమంది మహిళకు తెలిసింది. వాళ్లు మరిన్ని పొడవైన వరసలలో మొక్కలు నాటారు. అవన్నీ వేళ్లూనుకుని బాగా పెరిగాయి. ఒకప్పుడు ఒక్క మొక్క కూడా లేని చోట ఇప్పుడు మూడు కోట్ల మొక్కలు ఉన్నాయి.



The umbrella of green in Kenya returns.

కెన్యాలో పచ్చని నీడ తిరిగి వచ్చింది.



Women walk tall, their backs straight, for now they can gather firewood closer to home.

మహిళలు నిటారుగా, హుందాగా నడుస్తున్నారు, ఇప్పుడు కట్టెపుల్లలు వాళ్ల ఇళ్లకు దగ్గరలోనే దొరుకుతున్నాయి.



The land is no longer barren. Sweet potatoes, sugarcane, and maize grow again in the rich, red earth.

ఇప్పుడు భూమి బీడుగా లేదు. సారవంతమైన ఎర్రని నేలల్లో మళ్లీ చిలకడదుంప, చెరకు, మొక్కజొన్న పండుతున్నాయి.



The whole world hears of Wangari's trees and of her army of women who planted them.

వంగారి చెట్ల గురించి, వాటిని నాటిన మహిళా సైన్యం గురించి ప్రపంచమంతా తెలిసింది.



And if you are to climb to the very top of Mount Kenya today, you would see the millions of trees growing below you.

మీరు ఇప్పుడు కెన్యా పర్వతం ఎక్కితే దానికింద పెరుగుతున్న కోట్లాది చెట్లు కనపడతాయి.



And the green Wangari brought back to Africa.

ఆఫ్రికాకి వంగారి తిరిగి తీసుకుని వచ్చిన పచ్చదనం కనపడుతుంది.

“People are fighting over water, over food... we plant the seeds of peace.” – Wangari Maathai

“ప్రజలు నీళ్ల కోసం, ఆహారం కోసం కొట్టుకుంటున్నారు.... మేం ఆశల విత్తనాలు విత్తుతున్నాం.” – వంగారి మాథాయ్

